బాలసరస్వత్యనుబంధము నె ౩ రు.

శ్రీరస్తు.

# శ్రీనీతికథామంజరి

(ప్రథమభాగము.)

ఇది

శ్రీబాలసరస్వతీపత్రికా కార్యదర్శి యగు

మంగిపూడి - వేంకటశర్మ చే

రచియింపఁబడి

బ్రహ్మశ్రీ, మహారాజశ్రీ శతావధానులు

శ్రీతిరుపతి వేంకటేశ్వరకవీశ్వరులచే

సంస్కరింపఁబడినది.



(బాలసరస్వతీపత్రికనుండి పునర్ముద్రితము.)

మొదటికూర్పు.

చెన్నపురి.

శ్రీవైజయంతీముద్రాక్షరశాల.

1906



వెల, రు. 0—6—0

సోదరసోదరీరత్నములారా!

వెనుక సకలార్థదాయినీపత్రికయందు "స్త్రీనీతిమంజరి" యను పేర వచనరూపమునఁ బ్రచురింపఁబడిన నాలుగుచక్కనికథలనుఁ జూచి యవి స్త్రీజనాత్యంతోపయోగకరము లగుట నట్టిపొత్త మొండు వ్రాయఁ దలఁచి యది పద్యరూపమున నున్నచోఁ జదువరులకు మరింత యుత్సాహకరముగ నుండు నని తోఁచి ముందుగ నానాల్గుకథలునుఁ బద్యములుగ రచియించి మూడేండ్లకు మున్నె స్త్రీజనోపకారిణి యగు శ్రీజనానాపత్రికాముఖమునఁ బ్రకటించితిని. పిదప నేను వ్రాయ నెంచినరీతినిఁ గథలనుఁ గొలఁదికాలములోనే ముగించితిని. గాని కారణాంతరమున నాపత్రికయందు ముద్రింపింపక నిలుప వలసివచ్చినది. ఇందుఁ గొన్నికథలు మిగులఁ బెద్దవిగనుఁ గొన్నిచిన్నవిగను వ్రాయబడుటచే నీపొత్తము రెండుభాగములుగా భాగింపఁబడినది. ద్వితీయభాగముఁ గూడఁ గతిపయమాసములలో నిందె ప్రచురింతుము. పైనఁ జెప్పఁబడిననాల్గునుఁ గాక రెండవభాగమునం గూడ నితరులచేఁగల్పింపఁబడినకథలు కొన్ని గలవు. కథారూపమున నుండుటచే దీనికి "స్త్రీనీతికథామంజరి" యను పేరుచిత మని యట్లొనరించితిని. ఇది బాలికలకుఁగూడ ననుకూలముగ నుండునటుల సాధ్య మైనంతసులభశైలిని వ్రాసినాఁడను. మరియు స్త్రీధర్మబోధినియందువలె నిందును రేఫశకటరేఫముల భేదము పాటింపఁబడలేదు. రలలకు యతిమైత్రి ఘటింపఁబడినది. అఖండయతులునుఁ బ్రయోగింపఁబడినవి. ఇంచుగాగమంబులునుఁ గొన్నిచోట్లఁ గలవు. కించిజ్ఞుఁడనుఁ బిన్నవయస్కుఁడను నగుటచేతనుఁ, బొత్తమత్యచిరకాలముననె సమాప్తము చేయఁబడుటచేతను నిందుఁ బ్రమాదపతితాదిదోషము లనేకములుండవచ్చును. గాన సుధీమణు లెల్లరును గుణగ్రహణపారీణులగుదురు గాక! యని మిగుల వేడుకొనుచున్నాఁడను.

క. క్షీరములనుఁ గొని నేర్పున, నీరములను విడుచు హంస నికరముభాతిన్
సారములనుఁ గొనియిందలి, నేరములను విడరె! సుకవినికరములా–

క. కూరిమినిఁ దోఁచినట్టులు, కూరిచితిని మీకు మేలుఁ గోరుచు దీని
సారాసారవిభేదం, బారయకయె ప్రీతిఁ జదువరమ్మా! గరితల్

ఇట్లు,

మం. వేంకటశర్మ, బాలసరస్వ

# శ్రీ నీతికథామంజరి.

ప్రథమభాగము.

## ౧ వ కథ. కాకి—బంగారుపిచ్చుక.

క. ఒకనాఁడు ప్రొద్దుపొడుపున
నొకకాకము మేతకొఱకు యూరికిఁజనియం
దొకచో మిక్కిలిచక్కని
యొకనగరుఁ గనియటకేగి యుల్లాసమునన్ 1

క. విచ్చలవిడి విహరింపుచు
నచ్చోనొకచక్కనచటి యధిపతికినిబల్
మచ్చికగల యొకబంగరు
పిచ్చికఁగనియోర్వకిట్లు వెసవగచెనెదన్ 2

తే. అహహ! దీనియదృష్టమే మందునెందు
భాగ్యమన్న ననిట్లుండవలదెకలదె
జగతిలోపలమాపక్షి జాతిలోన
దీనికెనవచ్చు భోగమెం దెడుఖగంబు 3

క. ఊరంతయుఁ దిరిగిననా
కేరును రవ్వంతయోరె మిడకకసరిపల్
మారును గొట్టుదురీదార
గారాబముతోడదీని కాహారమిడున్ 4

క. ఆరయ, దీనికిఁదిన్నని
నోరును గడుజక్కనగుక నుగవయు మెంగమున్

జారతర బుద్ధిముద్దులు
గారెడుసుద్దులును గరులుఁ గారణముగదా! 5
క. ఇటెనావలె మాతులమం
దుదయించియు నన్ను మించి యు[illegible]భోగమ్ముల్
కొదలేక యనుభవింపగ
నెద మెరియగ నెట్టు నేసహించెదనకటా! 6
క. అని యోర్వలేనితనమునఁ
దనమనమున వాయసంబు తల పోయుచునుం
డెనచటి కంతటిలోపల
జనుదెంచి గృహాధిపతి వె సన్ జటకంబున్ 7
ఆ. చెంతఁజేరఁబిలచి చేతిపై వ్రాలిన
గేలమువ్విలీల మ్రోలనున్న
మునగచెట్టుపువ్వు లనుజూపి తెమ్మని
యనుపుటయునుసరగ నరుగుదెంచి 8
క. తనయేలికఁ గనిసంతస
మెనయఁగనవ్విరులుఁ దెచ్చియిడుచునదుమ నా
తనికరమున వ్రాలుచునె
మ్మినాతండిడెడుమేత మేయుచునుండెన్ 9
ఆ. ఈవినోదమెల్ల నీక్షించు నాచిరం
జీవి కన్నులపుడు చిల్లులువడు
నట్లుతోచి గొబ్బు నను బిచ్చుకనుజేరి
చెట్టుమీదికరిగి యిట్టులనియె 10
క. అన్నా స్వతంత్రజీవన
మున్న తమది వదలిపరుల పోషణముననీ
వున్నా వియ్యది నీమది

కెన్నఁగ నేభంగిఁగరము హితవయ్యెడినో 11

ఆ. పరుల కొలువుఁగొలుచు పనికన్న నైచ్యమీ
యేడులోకములను జూడరాదు
కావునను స్వతంత్ర జీవనమ్మె మేలు
గాఁగణింతురెందు ఘనులువినుము 12

క. మరియు నిదిగాక యింకొక
పరమరహస్యంబు మరుగు పరుపక నీకే
నెరిగింతు నీవుమాకుం
బరమహితుండవును ముఖ్య బంధుఁడవగుటన్ 13

క. నిన్నొ మెడుఁయేలికనీ
కన్నను బదిరెట్లువన్నె గలయొక గోఁరన్
మన్ననల తోడఁజెంచుచు
నున్నాఁడఁట సంతతంబు నుత్సాహమునన్ 14

ఆ. తేనెలొల్కుదాని తియ్యనిపల్కులు
చిత్తమలర జేయఁ జెలిమిమరచి
నెనరొకింతలేక నినుదానికెర వెట్టు
నెంచినాఁడఁటనిను బెంచురేఁడు 15

క. చిన్నప్పటినుండియు నే
నిన్నెరుఁగుదు నీవునన్ను నెరుఁగవులమున్
జిన్నవగుటగావుననిది
విన్నప్పటినుండి జాలి విడువదునన్నున్ 16

క. నాపలుకులు నిక్కంబులు
పాపపుదొరచేత భంగ పడెదవుసుమ్మా
పాపడ వేమియు నెరుగవ
యోపాపము పడిలమనుచు నొగిబోధించెన్ 17

క. కనకచటక మామాటలు
వినుచునచటఁ గొంతసేపు విరులనుసరగన్
గొని తెచ్చియిడక తడసినఁ
దనమనమున దొరకువిసుగు దలపోడముటయున్ 18

క. బంగరుపిచ్చుక చెంగలి
చెంగ కెలుంగెత్తి యరచు చిరజీవింగిం
కంగని తనమోదమునకు
భంగంబిదె తెచ్చెననుచు భావించివడిన్ 19

క. ఒకమంటి యుండఁగొనివిం
టికొనకు సంధించి కాకి నేసినగురిత
ప్పక యేగిదాని మొకమున
నొకచో నదితగిలి మూర్ఛ నొందెనడలుచున్ 20

క. కొంతవడికిదెలిసి కొనిలేచియాత్మలోఁ
దనదుచెడుగుణంబె తన్ను జెరిచె
ననుచు బరితపించుచును వేగజనుదెంచె
వాయసంబునిజని వాసమునకు 21

ఫలితార్థము.

తే. పరుల సౌఖ్యములనుజూచి భావమెరియ
నోర్వజాలనికన్యక యుర్విలోన
గరిత! బంగరుపిచ్చుక గాంచియోర్వ
లేని చెడుకాకివలె గడు హానిజెందు 22

## ౨ వ కథ. డేగలు—కప్పలు.

క. అమల జలసమృద్ధంబై
కమలకుముదపుండరీక కల్హారముఖో

త్తమ సుమవిలసితమై హం
సమఘపయుత మగుచు నొక్క సరసలరారున్ 1

ఆ. అక్కొలంకుపగట్టు నందొక్క చెట్టుపై
గవదొలంగకయె తడపులనుండి
గలహామనెడుమాట కలనైన నెరుగక
న్యోన్యమైత్రి డేగ లుండు రెండు 2

క. అందొక్క డేగ యొకదిన
మందొక్క స్థలంబునుండి మాంసపుఖండం
బుందెచ్చి యేకతంబున
విందుగుడుచుచుండెనట్టి వేళనుసరగన్ 3

క. రెండవది వచ్చితనకిడ
కుండగ నీడెగమెసవు చుండెబలల మొ
క్కండని మెండగుచలమెద
నిండగ దీనికిదిదక్క నిత్తునెయనుచున్ 4

క. అలుకందటుకున బలలశ
కలము బెనగికొని తింగ గడగు నెడన్ బల్
చలమొలయ మొదటిడేగయు
గలహామునకు రేగిదాని గైకొనెవడిగన్ 5

క. అంతట రెండవడేగయు
బంతంబున గదిసిదాని పైబడికాయం
బంతయును శితనఖంబుల
నింతింతలు గాగజీల్చె నెంతయుగింకన్ 6

క. మెకమెక పాటున వెనుదీ
యక ముక్కులబొడుచుకొనుచ హాంకృతితోజీ
రకొనుచు నఖముల బలుగతు

లొకటికొకటి పోరుచుండె హుంకృతు లెసగన్ 7
ఆ. ఈవినోద మెల్ల నీక్షించి లోచనో
త్సవ మొనర్చుకొన నెవలదలంచి
చెరువు వెడలివచ్చి చిరుకప్పలొకకొన్ని
చూచుచుండెఁ గరము జోద్యముగను 8
తే. అంతటను డేగ లామాంస మాత్రమునను
వాటముగ బల్మి నొకదాని నోటినుండి
యొకటి లాగికొన్వేళ గ్రిం దికినిజారి
పలల మాచిన్ని కప్పల పైనిబడియె
డేగలును గ్రిందికిని వ్రాలి వేగిరమున 9
క. అఱచుచు గఱచుచు వెఱచుచు
బఱచుచు మఱచుచును మరల బఱతెంచుచుఁ జోదల్
విఱచుచు జఱచుచు బోరుచు
నెఱచికొనుచు జెట్టుమీది కేగన్ వేగన్ 10
తే. చిత్రమును జూచుచుండిన చిరుతకప్ప
లెల్ల దమమీదబడిన యా యెఱచియొక్క
గట్టిపెమ్ముకను గరడు గట్టిమిగుల
బరువుగానుండుటయును దాని పాటునకును 11
తే. ఒడలు చిదుగుటచే గొన్నియును గడు వాడి
గలుగు డేగల కాలితాకులవదలను
నలిగికొన్నియునపుడు ప్రాణావశిష్ట
ములగుచు మరల దమయిర వులకుజనియె 12

ఫలితార్థము.

తే. కాన నిరుగుపొరుగువారు కలహమాడు
చుండగా జూచి యద్దాని నుడుపశక్తి

లేనివెలదులు వేడ్కకై వానిజూచి
బోవరాదెన్నడును మించుబోణులార! 13

## ౩ వ కథ. నక్క—కోతి.

క. సకల మృగనికరవిహార
ప్రకరాంచితమై సదావాసార్హంబై
ప్రకటసత్తరు యుతమై
యొకానొక యరణ్య మొప్పు నొకయెడనుర్విన్ 1

ఆ. అట్టికాననమునయందొక్క పొదనాడు
నక్కయొకటి కొన్ని నాళ్ల వెనుక
మాయమాటలకును మంచిజిత్తులకును
వాసమగుచు దానివాసముండు 2

తే. ప్రొద్దుపొడవకమునులేచి పొట్టచేత
బట్టుకొని పోయి రెండేని బక్కజంతు
వెదురయినబట్టి హింసించి వెక్కసముగ
దినుచు తుష్టాగికొనుననుదినమునక్క 3

క. ఈగతిని గొంతకాలం
బేగగ గోమాయువునకు హింసాఫలమో
నాగ క్షయరోగమొదవెదు
రాగత మెవ్వరికి బనికి రాదెన్నటికిన్ 4

తే. అంతకంతకు నధికమై యక్ష్మరుజయు
బెట్టిదములగు బాధల బెట్టుటయును
దిరుగబసలేమి మాంసము దొరకమియును
నాడు నాటికి జిక్కె నానాడు నక్క 5

తే. ఇట్లు కృశియించి వైద్యుల యింటికేగి

వినయమున దనరఁ గ్రమ్మత విన్నవింప
రక్తబలమునకై వెజ్జు లందరేక
రీతి నౌషధము జెప్పి రిట్టులనుచు 6

తే. రేపకడ గోతిపిల్లల లేతమాంస
మెట్టులేని సంపాదించి యిచ్చుదీర
దప్పక భుజింపుమొక్కఁ మండలము దనము
లనినజంబుక మాత్మలో హర్షమొంది 7

తే. త్రాగఁగోరెను క్షీరముల్ రోగివైద్యు
లాగతికి సమ్మతించిర న్నట్లు నేడు
పండె నాపుణ్యములుమది వలచినట్టి
కోతిమాంసమె మందయ్యె గోర్కెదీర 8

క. అనియనుకొనుచును ముదమున
మునుఁగుచు దేలుచును మాంస మునకై విపిన
మ్మునఁ గల్గడ లన్నెమకఁగ
బనివడి చనియొకయెడ నొక ఫలవృక్షంబున్ 9

ఆ. ఆశ్రయించియున్న యట్టిపిల్లలగోతి
నొక్కదానిగాంచి నిక్కమట్లు
కల్లచెలిమిచేసి కాపురంబుండెనా
చెట్టుచాయలందు జెట్టునక్క 10

క. ఎన్నడులేనిది తనతో
జెన్నుగనీమాయనక్క స్నేహించువిధం
బెన్నఁగ గారణమేమో
యున్న దనుచు గోతియాత్మ నూహించికడుం 11

తే. సందియము భయమునుమది సందడింప
దనదుపిల్లలతోడ భద్రముగ జెట్టు

మీఁద నేయుండినక్కను సాదరమున
మాయమాటలాసంగుచు మసలుచుండె 12

తే. లోకమునవానరములెల్లఁ బ్రాకటముగఁ
బ్రీతిబిడ్డలఁబొత్తిళ్లఁ బెట్టుకొనిచ
రించుటసహజమగుటగోరికసులువుగ
నక్కనెరవేర్చుకొనవీలు చిక్కదయ్యె 13

క. ఈగతినిగొంతకాలము
జాగగుటకునక్కమదిని సైపకకోర్కెన్
వేగిరమునఁదీర్చుకొనఁగ
బాగుగఁదలపోసియొకయు పాయముఁబన్నెన్ 14

తే. నక్కయిట్లనునక్కరో! నిక్కముగను
భూతదయఁబూనిపాపుపు భూతహింస
మానితివములమాత్రమె మమతనమలు
శాంతుఁడగునన్నునొకసారి సాదరమున 15

తే. నీదుకౌగిటజేర్చిమన్నించితేని
లోలుకుతియ్యనిపలుకులు బలికిమనల
వాస్తవపునేస్తమునకును వన్నెవెట్ట
వాయనుచువేడెమాయగోమాయువపుడు 16

క. ఆమాటలనించుకయే
దోమర్మంబున్నయట్లు తోఁచియథార్థం
బామెయినెరుంగగోరియు
గోమాయువుగాంచియిట్లు కోతివచించెన్ 17

తే. మిత్రమా! నాదుపొత్తిట మేనుమరచి
నిదురనొందెడుబిడ్డలనిదుగొంచిగురు
సెజ్జఁబవళింపజేసిచె చ్చెరనెవత్తు

గానదయయుంచితాళుమా క్షణముసేపు 18

క. ఆమాటలువినినంతనె
గోమాయువునెత్తు చెదుట గనునపుడెంతే
దామదిఁగటకటఁబడిశా
ఖామృగమునుగాంచిపలికెఁ గడుదైన్యముగన్ 19

తే. ప్రాణమిత్రమబిడ్డల వాపుదనము
చేతఁజిరకాలముగనుశు ష్కించియున్న
దానదయ చేసినీదుపుత్రకుల జూపు
మొక్కసారిమదీయ నేత్రోత్సవముగ 20

క. అనిమరిమరిఁదనుబ్రతిమా
లినమాయలనక్కజిత్తు లెల్లనెరిగిమె
ల్లనవానరమల్లనన
క్కనుఁగనుఁగొనియిట్టులనియెఁ గడుయుక్తముగన్ 21

తే. ఓసృగాలమ! నీగభీ రోక్తులువిని
భయముచేఁదుల్లిపడుచున్న వకటయింత
పిన్న కూనలునీబోటి పెన్మెకముల
నిప్పుడీక్షింపగాజాల వింతనిజము 22

తే. ఇంకనొక్కటివినుమిప్పు డేనునాదు
కూనలకుఁబాలొసఁగవలెఁ గానమనల
నెయ్యమునుజిత్తమందుంచి నీదుపనుల
మీఁదవేగమె పోయిర మ్మెచటికైన 23

క. అనినేరుపునజవాబి
చ్చిననాశాభంగి మొంది చెచ్చెరఁదనవ
చ్చినదారినెచటకేనియుఁ
జనెఁజేయునదేమిలేక జంబుకమంతన్ 24

## ఫలితార్థము.

తే. కైతవస్నేహ మొనరించి ఘాతచేయు
కుచ్ఛితుల పెనుమాయలఁ గూలఁబడక
మెలఁత! కడుజాగరూకత మెలఁగవలయు
నక్కచే భంగపడని వానరముభంగి

## ౭వ కథ. కాపు. ఎద్దు.

ఆ. కాపువాడొకండొ కప్పుడుతనవ్యవ
సాయపుంబనులనుఁ జేయుటకును
సంతకరుగుదెంచి సరగునఁగొని తెచ్చె
వెలయొసంగి మూడు వృషభములను.

ఆ. వానిలోననొకటి గానుగు టెద్దును
నొకటిగోనె టెద్దు నొకటిగంగి
రెద్దునైతనతన యొకిమీంద్రచేతను
విక్రయింపబడినవి క్రమముగను.

తే. కాపువాడంతదనపాలి కాపువాండ్ర
కపుడెయామూడుగిత్తల నప్పగించి
పనులుసరిగ మూడెడ్లచే గొనుడటంచు
నానతిసొసంగియెందేని నరిగెనతడు

తే. పాలికాపులువానిచేఁ బనులుగొనెడు
నెడలగోనె టెద్దునుగాన్గు టెద్దునది
వరకెపాటొందనలవాటు పడినవగుట
చేతయుక్తముగాఁబనుల్ చేయజొచ్చె

తే. మూడవదియగుగంగెద్దు మొదటినుండి

యించుకంతయుగష్టము లెఱుఁగకుంట
దోడిపాటివృషభముల తోటిసరిగ
జేయఁజాలక యిటుతల పోయఁదొడఁగె 5

తే. ఇలనుజనియించినది మొద లింతదనుక
నిట్టిమోటుపనులొకింత యేనియెన్న
డైన నేనెఱుఁగుదునె బల్ హాయిగాఁగ
నతులసౌఖ్యములనుభవించితినిగాని 6

తే. వింతరంగులపుట్టముల్ వెసనుదాల్చి
కొమ్ములకు మేలివన్నెల నెమ్మినించె
గములుఁజుట్టికొనియు వెలఁగలనఁగలనుఁ
బెట్టుకొనియును సేవకుల్ చుట్టుముట్టి 7

క. నలువుగనుఁదూర్యనాదం
బులుమిన్నునుముట్టఁజెలఁగి మ్రోయింపుచునన్
బలువిధములసగ్గింపుచు
వెలయఁగఁజూపరకుఁగరము వేడ్కైతోపన్ 8

తే. కేలుఁగవఫాలతలమున గీలుకొలిపి
దాసులందఱు మ్రొక్కఁగావి లాసమెసఁగ
లాస్యమునుజేయుచునుమహా రాజువలెను
రాజవీధులవిహరింతు రాజసమున 9

తే. కష్టపడిసౌఖ్యపడవచ్చు గానిసౌఖ్య
మొందియెవరికిఁగష్టంబు లందరాదు
తనివితీరంగభోగమ్ము లనుభవించి
యిట్టిదురవస్థనిప్పుడే నెట్టులోర్తు 10

తే. ఇంతబ్రతుకుబ్రతికి యింటివెనుకఁజచ్చె
నన్న యట్లుపొలము దున్ను పనికి

నమకెయుంటినేని నాఘునతకుసరి
వారిలోపల దలవంపుకాదె 11
క. కానీ యేలాగడువక
మాను నెచూతామటంచు మానసమునదా
మానకతల పోయుచుసుం
తైననుబని సేయకుండె నతిమూర్ఖత చేన్ 12
గీ. ఇట్టులెంతేని రాయసం బుట్టిపడగ
దున్న కేమానమును దాల్చి మిన్న కున్న
గంగిరెడ్డునుగనిపాలి కాపులెల్ల
బోలముదున్నింపపలచి దా పునకువచ్చి 13
క. మూపున మెల్లననాగలి
మోపంగాబోవనొక్క మొగిబొడుచుచు బల్
కోపమున ఱంకెలిడుచును
గాపులనందరిబికాపి కలుగావించెన్ 14
ఆ. అంతగంగిరెడ్డు స్వాధీనమును జేసి
కొనగలేక వాడు కొడువయెడ్ల
చేత నెల్లబనులు జేయించుకొనినాటి
మాపుయింటికరిగి కాపుకనిరి 15
క. అయ్యూయొక్కడియెద్దో
దయ్యమువలెనొకటిమనకు దాపురమయ్యెన్
చయ్యన నేటిదినమువిూ
రొయ్యననొని తెచ్చినట్టి యుక్తుంబులలోన్ 16
క. అయ్యెద్దునుదున్నింపగ
జయ్యనదరిజేరుమమ్ము జావగబొడిచెన్
వెయ్యిగతులమమ్మేచిన

దయ్యాలుచెప్పంగజాల మావెతలెల్లన్ 17
క. వెయ్యేటికినయ్యెద్దును
నెయ్యేడకోపంపివిక్ర యించెదమంచుం
గుయ్యాడినగాపునవ్వుచు
దియ్యమ్మునదనదుకమ్మ తీండ్రకుననియెన్ 18
గీ. మత్తగిల్లినగిత్తను మెత్తజేయ
జాలకమ్మెదమనెడుమీ బేలతనము
సానబట్టకమాసిన మానికంబు
గవ్వలకువెలబోసిన కరణిగాదె 19
గీ. ఇట్లుకమతమువారిజీ వాట్లువెట్టి
భూమియజమానిమరునాడు పొలమునకును
మూడుగిబ్బలదోడ్కొని పోయిమరల
నఱకలనుబూన్చిదున్నించు నవసరమున 20
గీ. మొదలిరెండునుయజమాని ముదలబూని
జేనిపనులెల్లజూరుకుగా జేయుటయును
మూడవదిపనిచేయక మునుపటివలె
గంటగించుటయునుదన కంటగనియె 21
గీ. కనియుయజమానియెంతేని గినుకబూని
పెద్దదుడ్డులతోదాని బిట్టుమోది
మీకుస్వాధీనమగుదాక మేతదీని
కిడకుడనియానదనకమ్మ తీండ్రకిడియె 22
క. వారునుదక్కినయెద్లకు
హారముబూర్ణముగనిడుచు నధిపతియాజ్ఞా
కారణముగ గంగెద్దుకు
హారముగొన్నాళ్లువెట్ట కైరిచలమునన్ 23

గీ. గంగిరెద్దుమూన్నాళ్లకు గడుగృశించి
లేచుటకునైనసత్తువ లేనిదైత
నంతదన తెల్విలేమిచే నింతపుట్టు
మునుకదాపురమయ్యెనం చును నెరింగి 24

గీ. మిగులతనమూర్ఖతకుమది వగలబొగిలి
బుద్ధిదెచ్చుకొనియునాడు మొదలుతనదు
తోటియెడ్లతో బాటుగ బాటువడుచు
బాలికాపులమన్నన బడయుచుండె 25

ఫలితార్థము

ఆ. ఓర్పుతోడుత బనులొనరింపనొల్లని
యింతికాపువాని యెద్దువలెను
విభునిచేతగరము వెతనొందుగానగ
ర్వమునబ్రాలుమాల రాదుసఖులు 26

## ౫వ కథ. సాధుగుఱ్ఱము మోటుగుఱ్ఱము

క. ఒకమనుజుడశ్వములవ
ర్తకమును జేయంగదలచి దవ్వులగలసం
తకుబోయి వెలయొసగిశా
బకములరెండిటినిదెచ్చె బాగగువానిన్ 1

క. తెచ్చికడుపారనిచ్చలు
బచ్చికయునువలయురీతి బలుగగ్గిల్లన్
మెచ్చికడుబ్రీతినిచ్చుచు
మచ్చికమెయిమేపెగొన్ని మాసములంతన్ 2

క. బలముచుమదమునునూరుపును
గలవైచక్కందనంబు గలిగినవైని

చ్చలు పెరుగుచుండె నెమ్మిఁ
దిలకించినవారియాస దీర్ఘముగాఁగ 3

క. తదనంతరమున నప్రు
గోదమలకును విద్యగీలు గొలిపినలాభం
బోదవునధికముగ దనకని
మదివర్తకుఁడెంచియొక్క మంచిదినమునఁ 4

క. జీతము బత్తెమునిడి యొక
రౌతును బిలిపించి గోదమ లనుజూపికడుఁ
లేతవి శిక్షలకోర్వవు
భీతినుడిపి వల్గనముల భీతిగఁ ద్రుమా 5

ఆ. అనుచుఁ బ్రీతితోడ నప్పగించినమంచి
దనుచు నశ్వములను నల్లదట్టి
చేతనిమిరి యాశ్వ శిక్షకుండొకదాని
బట్టికళ్లియంబు వెట్టి యెక్కి 6

తే. మెలఁగడకల నెల్లను మెల్ల మెల్ల
గొన్ని సైగల చేబలు కులను గొన్ని
కొన్ని గురుతుల చేమరి కొన్ని కొన్ని
తెరగులనుగరపుటయున త్రొగ గెల్ల 7

క. అతిసులువుగ గ్రహియించుచు
మతి నెరిగినవాని హయము మరువక భయముఁ
గాతుక ముజతపడ నేరిచె
గతిపయదివసములకశ్వ గతులెల్లపగఁ 8

క. తక్కినతురగము శిక్షకు
డెక్కనక్షమం దెయతని నిలద్రోచివేసఁ
దిక్కులవియ సకిలించుచు

ద్రొక్కఁగరఁగ చిత్తన్ని పరచె క్రోధంబడరఁగ

క. అక్కాణికి రేవంతుం
డక్కజపడిపట్టిసాహ సాయత్తుఁడై
కక్కులకళ్లెముదగిలిచి
గ్రక్కుననశ్వంబునెక్కె కడుజాగ్రతగన్

క. నడపింపఁగనుంకింపఁగ
నడువక కడుజడుపుతనము నంబునబోడమున్
వెడగుహయమశ్వశిక్షకు
గడగడవడకించి వెడగు గతిబరుగిడుమున్

గీ. పురము నాలుగువీధులు తిరిగితిరిగి
యొక్కయెడనొక్కచెట్టున నొక్కపట్టి
యెమ్ములన్నియువిరిగి దూర్ణమ్ముగాగ
రాచిధూర్తలమునబడ వైచెమరల

ఆ. కడసుజావుతప్పి కన్నులొత్తైగాశ్వ
పాలసుండుతనదు బాటజనియె
మత్తగిల్లిగుఱ్ఱ మంతకంతకునేరి
లెక్కగానకసంచ రింపుచుండె

గీ. ఇట్టుకతిపయమాసమ్ము లేగువెనుక
వర్తకునియొద్ద మేలియశ్వంబొకండు
కలదనువదంతియొక్కటి కలిగియెల్ల
యెడలవ్యాపించె వ్యార్త పురములోన

క. ధనికుడొక డావదంతిని
వినివర్తకుడడిగినంత వెలయిచ్చిహయం
బును దోడ్కొనిచనితనసా
హీణములకన్న నుగరంబు హితమొసగంగన్

వారువమును సారెసనను
వారమువారయుచు గారవమునిర్ణయమిం
పారనుదయాస్తమయముల
స్వారికిఁబూన్చుచుఁ బ్రేమ సమధికమగుడుఁ 16

జానగురతనపుఁగళ్లెము
మానికములవాగెపట్ట మయమునువజ్రా
లీనెడుపల్లమునీలా
లానినమేలంకెవన్ని యలునుహయాలుగఁ 17

రంగారుమేలిజలతా
రంగీలుహయారంగుగాదు రంగమునరుతఁ
బంగారుతొడవులెంతే
సింగారమెసంగఁగఁగయి సేయించునొగిఁ 18

అఖిలసౌఖ్యములను ననుభవించుచునుండె
నట్లువిద్య నేర్చి నట్టిహయము
దుండగమునునున్న రెండవవాజినొ
క్కరునుఁగొనరుచిల్లి గవ్వకైన 19

అంతఁదురంగమునతఁడొక
సంతకుఁగొని పోయియొక్క చాకలికినినొ
క్కింతవెలకమ్మవచ్చెదు
రంతపుబుద్ధివశము భువిన లంఘ్యంబుగదా! 20

తిన్నగా మేతలేమిచే సన్నగాని
పాటుచేతనుఁదొల్లింటి పాటవంబు
చెడిదినంబులవెంబడిఁ జిక్కిచిక్కి
కరమురూపునఁగుఱ్ఱము గాడిదయ్యె 21
మూటలను రేపుమాపును మోసిమోసి

కాయమంతయుఁ గాయలు కాచికాచి
మిగులఁ దనమూర్ఖతకుమది వగచివగచి
మోటుగుఱ్ఱముకడుఁ గష్ట మొందుచుండె

ఫలితార్థము.

ఆ. విద్య నేర్చినట్టి వెలఁది సౌఖ్యముఁ జెందుఁ
గుతలమందు సాధు గుఱ్ఱమట్లు
చదువెఱుంగనట్టి మదవతి జగతిపై
గోడుఁ జెందు మోటు గుఱ్ఱమట్లు

## ౧౬వ కథ. కోమటి. కొడుకులు.

క. ధనికుఁడగు వైశ్యుఁ డొక్కఁడు
తనమరణసమయమునందుఁ దనయుల్వారునం
దనులకునుఁ దనకుఁ గలిగిన
ధనమెల్లసమముగ నిచ్చి తగ నిట్లనియెన్

క. ధనసంపాదన మేరికి
ఘనతరకష్టంబుగానఁ గడుజాగ్రతఁగా
కొని దుర్వ్యయంబు సేయక
ధనమునుఁ గాపాడుకొనఁగఁ దగు సుతులారా

గీ. దానధర్మంబులనుఁ జేయు తరిని నైన
నొడలెఱుంగని బత్తిచే నొద్దనున్న
విత్తమెల్లనుఁ జూరగా విడువరాదు
కొంచెమేనియుఁ గూర్చక కుడువరాదు

గీ. నరుఁడు గడియించినట్టి ధనంబులోన
నొక్కపాలు భుజింపుచు నొక్కపాలు
యోగ్యదానముల్ చేయుచు నొక్కపాలు

నయమునను నిల్వఁజేయుచుండంగవలయు 4

౫. పుత్రకులకిట్లు జనకుండు బోధచేసి
కాలధర్మము నొందెనా బాలకులును
జేయుచుండిరి తమతండ్రి చెప్పినట్టి
సారతరధర్మముల శిరసావహించి 5

౬. పాడితప్పక, కూర్చుట పాత్రులైన
యర్థులకు శక్తికొలఁదిని నర్థమిడుట
సత్క్రియాపరులగుటను సత్వరమున
నర్థమభివృద్ధియయ్యె బేహోదులకును 6

౭. తదనంతరమున జ్యేష్ఠుడు
మదమునఁ దనతండ్రియాజ్ఞ మరచి లవంబున్
సదసద్వివేక మెరుఁగక
కుదురింతయు లేని ఖలులఁ గూడి తిరుగుచున్ 7

౮. ఒకపరి సోగటాలాడుచు
నొకమరి చతురంగమాడు నొకమాఱు జూదం
బొకసారి నెత్తమాడును
నొకపందెంబునకు నోడు నొకవేరూకల్ 8

౯. లంజలఁ గూడును కల్లును
గంజాయియుఁ ద్రాగు మృగఖగముల నదయతన్
భంజించి మాంసము భుజిం
చుం జుట్టాలం ద్యజించు సుజనుల నొంచున్ 9

౧౦. ఈతీరున జరియించుచు
జేతం గలయర్థమెల్లఁ జెల్లిన వెనుకన్
ఘాతకుఁడై చోరకుఁడై
వీతభయుండై చరించు వీథులయందున్ 10

తే. దొంగతనమున కొక్కనాఁ డొక్కచోటి
కరిగి యట వారిచేఁ జిక్కి యపుడె యాతఁ
డొక్కకారాగృహంబునం దుంచఁ బడియె
జార, చోరత్వములు బాప శక్య మగునె! 11

ఆ. వానిసోదరుండు దానకర్ణుం డని
ఖ్యాతి వడయ వలయుఁ గాక యనుచుఁ
గ్రిందు మీఁదుఁ దెలియ కే రొక్క మంతయు
సెలవు చేయు చుండెఁ గొలఁది లేక. 12

తే. అటుల జరుగుచు నున్నట్టి యవసరమునఁ
జక్కఁదనమున కిక్కయై సద్గుణముల
దొంతి యై చెలువల మేలు బంతి యనఁగ
నతని కానందముగ నొక్కసుత జనించె. 13

క. బాలకులు లేకపోవుట
బాలిక యొర్తగుట గురులు బాళినిఁ బెంపన్
బాలిక బాలకళానిధి
పోలిక నానాఁట వృద్ధిఁ బొందుచు నుండెన్. 14

ఆ. బాలికామణికిని బరిణయప్రాయంబు
వచ్చె నంతఁ దగినవరున కీయఁ
దలఁచి బయలుదేరి తండ్రి బర్హిక్షుతో
దేశదేశములనుఁ దిరుగఁ దిరుగ. 15

క. చక్కఁదనమ్మును మిక్కిలి
రొక్కము బ త్తెలివితేఁటలునుఁ గలిగినవాఁ
డొక్కఁడును వణిక్కులలో
నిక్కమ్ముగఁ జిక్కఁ డయ్యె నిక్కుతలమునన్, 16

తే. కన్నియకు సాటి వచ్చుమగండు దొరక
మికి వగచి తండ్రి యెట్టకేలకును నొక్క
ధనము గలిగిన మరి చాల దా యటంచు
నొక్కకోటీశ్వరునిఁ గాంచి యుత్సుకమున. 17

క. మీతో వియ్యము నందఁగ
నే తెంచితి మీదుసుతున కిచ్చెద సుగుణో
పేతను నాకూఁతును మీ
రీ తెఱఁగున కిప్పుడు కూర్మి నీ కొనవలయున్. 18

ఆ. అనుచుఁ బ్రస్తుతించి యాతనియనుమతిఁ
బడసి కౌతుకమున వెడలి యింటి
కేగి భార్యతోడ నీసమాచారముఁ
జెప్పి పెండ్లిపనులు సిద్ధపరచి. 19

ఆ. చేయఁ బోయి పెండ్లి సేతునా యింక నా
కింతకంటె వేడ్క నొద్ది కలదు
సొమ్ము లన్ని యిపుడె వచ్చు గానిమ్ము ధ
నాఢ్యుతోడ వియ్య మందఁ గంటి. 20

ఆ. అనుచు నాత్మలోన నానంద పడి తల
విరియఁ బోసి తనదువిత్త మెల్లఁ
గట్నములకుఁ గానుకలకునుఁ దాళమే
ళముల కాస్తభోజనములక్రింద. 21

తే. విప్రసంభావనలక్రింద వెచ్చపెట్టి
బాలికకుఁ బెండ్లి బహువైభవముగఁ జేసి
స్నేహితులుఁ జుట్టములు నిండ్లు సేరుకొనెడు
వరకె కన్యాప్రదాత దివాలఁ దీసె. 22

ఆ. చిన్నవాఁడు తండ్రి చెప్పినబుద్ధులు
మనసునందు నిల్పి యనయ మట్లు
చేయుచుండి సకలశ్రేయంబు లొందుచుఁ
గాల మతిసుఖముగఁ గడపుచుండె. 23

## ఫలితార్థము.

తే. కాన దానములనుఁ జేయుకాలమందు
నైన ఘనకార్యముల పట్ల నైనఁ గాని
వెలఁదిరో! కీర్తికై తల విరియఁ బోయ
కాయము నెఱింగి వ్యయముఁ జేయంగ వలయు. 24

---

## ౭-వ కథ. చీమ, చందమామ.

క. కల దొకకాసారము ని
ర్మలజలయుత మై విమలకమలవిలసిత మై
జలచరసంసేవిత మై
కలహంసప్రముఖకలిత ఖగకులరుత మై. 1

ఆ. దానితీరమందుఁ దనరు నొక్క రసాల
భూరుహంబు దాని మూలమందుఁ
బెద్దపుట్ట వెట్టి వేనవేలు పిపీలి
కంబు లుండు నందుఁ గాపురంబు. 2

తే. అంతఁ గొన్నాళ్లు సనినయనంతరమున
సకలజంతువులకునుఁ దాపకరమును వి
దాహకరమును నైన నిదాఘదినము
లరుగుదెంచె నాగ్రీష్మకాలంబునందు, 3

క. పగ లెల్ల వేఁడిగాడుపు
సెగలకుఁ గడు నలసి సొలసి చీమలగమి యె
ల్లగఁ దరలె నొకదినంబున
జగతికి సంజతఱిఁ గరముఁ జల్లఁదనముకై. 4

తే. నాఁడు పున్నమ యగుట నందముగ లోక
మెల్లెడలఁ బాలగచ్చు చేయించినట్లుఁ
బిండి చల్లినగతి భువి నిండి యుండెఁ
బండువెన్నెల కన్నులపండు వగుచు. 5

క. వెలయఁగ మలయాచలమునఁ
గలచలువనుఁ గూడి మాడి కైరవగంధం
బులఁ గొల్లలాడి సరసీ
సలిలంబుల నోలలాడి శైత్యకరుం డై. 6

తే. మందముగ వీచు చుండెను మారుతుండు
నఖిలజీవంబులును హాయి హాయి యనుచు
సంతసం బందు చుండె నాసమయమందు
స్వేచ్ఛగా విహరించుచుఁ జీమ లెల్ల. 7

ఆ. చల్లగాలిచేతఁ జంద్రికచే సేదఁ
దేరి యెల్లయెడలుఁ దేరి పారఁ
జూచు నంతఁ దోఁచె లోచనమ్ములకును
స్మరుని మేనమామ చందమామ. 8

ఆ. చీమ లెల్ల నపుడు సోము సోయగమునుఁ
జూచి యాత్మ లందుఁ జోద్య మంది
యతనిశీతలతకు నాశ్చర్యమునుఁ జెంది
మెచ్చె నెదల మోద మెచ్చరింప. 9

ఆ. ఆపిపీలికంబులం దొక్క చిఱుచీమ
పలికె నిట్లు తక్కవానితోడ
మాటిమాటికిం దనమానసంబునం గుతూ
హలము పొంగి పొరల నతిరయమున. 10

క. ఈతనిచేం గద నానా
భూతవ్రాతములు గ్రీష్మమునం జండకర
స్ఫీతాతపమున డస్సియుం
జేతోమోదమున మరల జీవముం గనుటల్. 11

తే. చూడ ఖేచరుం డయ్యు నీసొగసుకాండు
చూపరమనంబులం గరంచు చున్నవాండు
చాలదూరస్థుం డయ్యు నీశైత్యకరుండు
చల్లదన మిచ్చుచున్నాండు జగతి కహహ! 12

క. బళిరే! దవ్వుల నుండియె
బలు వగుందాపముల నెల్లం బాపంగం గలయీ
చలువలదొరచెంగటం గల
చలువకు విలువయునుం గలదె చర్చింపంగాన్. 13

ఆ. తివిరి యొక్కసారి దివి కేగి చంద్రుని
ముద్దుగారు నవ్వు మోముం దన్మి
మించుటద్దములను మించుం జెక్కులు ముద్దు
లాడం దలంతు నాతలంపునందు. 14

క. నాకోరిక యేతీరునం
జేకూరు నటంచు వెరవుం జింతింతు మదిన్
మీ కేరి కైనం దోంచిన
నా కెఱుంగంగం జెప్పుండు సకరుణముగా ననినన్. 15

క. ఎకసక్కియమ్ము లాడుచు
వికవిక మని నవ్వి యాపిపీలిక లాచీ
మకు ననియె నక్కజంబున
నకటకటా! యాత్మశక్తి నారయవలదే. 16

ఆ. ఆత్మశక్తి నించుకంతైన నెఱుఁగక
చేయఁగూడ దట్టిచేత లైన
"జంబుకం బదేడ స్వర్గలోక మదేడ
చీమయేడ చందమామయేడ. 17

క. ఎవ రైన నిట్టికోరిక
భువిఁ గోరినవారు గలరె మున్నెపు డైనన్
తివిరిన గొంతెమకోరుకు
లవుఁగా కిటువంటితలఁపు లవి చేకురునే! 18

తే. ఊర కాయాసపడ నేల యుడుగు మిట్టి
పిచ్చితలఁ పెన్నఁడునుఁ దలపెట్టఁబోకు
మందరానిఫలంబు సుమ్మా! యటంచు
నింక నేమేమొ చెప్ప నూహించునెడను. 19

తే. ఆచిరుతచీమ యాచీమ లాడునట్టి
పలుకులకు నడ్డమై యిట్లు పలుకఁ దొడఁగె
"సాహసే లక్ష్మి" యంచును "సాధనమునఁ
బనులు సమకూరు" నంచునుఁ బలుక వినమె! 20

క. అచలమతి నారుపాళు లు
పచరించిన నెక్కపాలు భగవంతుండే
రచియించు "సప్తమం దై
వచింత" మ్మనుపురాణవచనము వినమే! 21

ఆ. తాల్మి గలిగి పట్టుదలతోడఁ జేసిన
నెంతకార్య మైన నెవరి కైనఁ
గరతలామలకము గాదె కార్యఫలంబు
గాన దీని నేను గడఁగుదాన. 22

ఆ. అనుచుఁ దక్షిణమున నచ్చోటఁ గలయట్టి
చెట్టుయొక్క చిట్టచివర నున్న
చిన్నరెమ్మమీఁదఁ జేరి తదేకచి
త్తమునఁ జూచు చుండెఁ గుముదహితుని. 23

తే. అంతటనుఁ దెల్లవారె నయ్యవసరమునఁ
గాలవశమున నొకపెద్దగాలి వీచి
పట్టు వదలి కొలంకులోఁ బడెను చీమ
అవని "శ్రేయాంసివిఘ్నాని" యనఁగ వినమె! 24

క. పడి నీటిమీఁదఁ దేలుచుఁ
గడుధైర్యంబున సమీపకమలంబును నే
ర్పడరంగఁ జేరి మెల్లన
నెడఁదనడలు వొడమి చీమ యిట్లనుఁ దనలోన్. 25

క. "ఎట్టిచెడుమూర్తమునఁ దల
పెట్టితినో మొట్టమొదటె బెట్టిద మగుని
క్కట్టు వడి చచ్చి బ్రతికితిఁ
గట్టా! యికార్య మెట్టు కాఁగల దొక్కో!" 26

క. వీరిడి నై యాత్రమునన్
రేరాజునుఁ జూచివత్తు నే నిదె యనుచున్
బీరము లాడితి నాసిరి
వారితో నిప్పు డెట్లు చూతు వారిమొగంబుల్. 27

క. ఎది దారి యాకసంబున
కెది నాకు నుపాయ మిప్పు డీకార్యముఁ జే
యుదునా మానుదునా యే
విధమునఁ జనుదాన దివికి విధుసన్నిధికిన్. 28

తే. ఇట్లు చింతించి చింతించి యెట్టకేల
కక్కరణి సెను ధైర్యము నెదఁ జిక్కఁబట్టి
గణుతి కెక్కెద నిమ్మేటికార్య మాచ
రించి యని యెంచి మది నిబ్బరించి మించి. 29

తే. "నిపుణమతు లెప్డు విడువరు నిశ్చితార్థ"
మనెడు నుడి బీర వోకుండఁ బ్రాణ మున్న
యంతదనుకఁ జేసెదఁ గాక! యత్న మనుచు
నుండె చీమ పిదప దైవయోగమునను. 30

క. సారెకును వీణ మీటుచు
నారాయణుఁ బాడుకొనుచు నారదుఁ డపు డా
దారినిఁ బోవుచు నాకా
సారమునం గలుగుసారసములనుఁ గనియెన్. 31

తే. ఆసరస్సున దిగి కొన్ని యబ్జములనుఁ
గోసికొని వచ్చె నం దొక్కకుసుమ మందుఁ
దమకమున మకరందంబుఁ ద్రావుచుండె
చిత్రగుణసీమ యగుమన చిన్నిచీమ. 32

క. కోరిక గలిగియొ! ముని ని
ష్కారణకృపఁ జీమకోర్కె సఫలముఁ జేయం
గోరెయొ! కా కెందుకొ! పం
కేరుహములం చిదిమె నెవ్వరి కెఱుఁగఁగవచ్చున్. 33

తే. ఆవిరులు గొని రయమున నరుగుదెంచి
రజతగిరిరాజమౌళిశిరంబునందుఁ
జెలఁగి యర్చించె భక్తి సంశీలుఁ డగుచు
నారదుఁడు తత్త్వవిద్యావిశారదుండు. 34

తే. అంత నాచీమ చంద్రునిచెంత నుంట
కెంతయును విస్మయం బంది హృదయమునకు
నందరానిబ్రహ్మానంద మంది దైవ
మహిమ గొండాడి పలుమారు రహినిఁ దనదు
తనివి దీరంగఁ జంద్రు ము ద్దాడె నపుడు. 35

ఫలితార్థము.

తే. పణఁతిరో! ఘనకార్యంబుపట్ల నైన
వెరపునను వెనుదీయక వెర వెరింగి
చాలపట్టుదలయు సాహసమునుఁ గలిగి
చీమవలెఁ గార్యఫలమునుఁ జెందవలయు. 36

---

8-వ కథ. బ్రాహ్మణుఁడు, బంగారము.

తే. బీదవాఁడును, బహుకుటుంబియును నైన
బ్రాహ్మణుం డొక్కఁ డొకచిన్నపల్లెయందుఁ
గాపురం బుండి యటకు దాదాపునఁ గల
పట్టణంబుల కరుదెంచి ప్రతిదినంబు. 1

తే. ప్రతిగృహంబున యాయావరంబు నడిగి
తండులంబులు గొని తెచ్చి దార కిచ్చి
వేగ వండించి ముందుగా బిడ్డల కిడి
కడమఁ దానును భార్యయుఁ గుడుచుచుండు. 2

క. చాలాకష్టముగా నిటు
కాలముఁ నడుపుచును వాడుకగ నొకనాఁ డా
పాళ్లెఁపువిప్రుఁడు వేకువ
వేళను మేల్కాంచి కాల్యవిధు లొనరిచియుఁ. 3

తే. యాచనకు నొక్క పురమున కరుగుదెంచి
యచట లభ్యము లైనధాన్యాదికముల
మూటలను మూపునం దిడి మోసికొనుచు
గహనమార్గముననుఁ దనగృహమునకును. 4

ఆ. వెడలి దారిలోన బీరెండచేఁ గాళ్లు
కాల నెత్తి మాడఁ గరము దస్సి
యొడలు కంప మొంద వడి వీచుగాడుపు
సెగల మిగుల నొగిలి దగనుఁ జెంది. 5

ఆ. కాలు గదప శక్తి చాలక యొకచెట్టు
నీడ సొమ్మసిల్లి నిలిచె విప్రుఁ
డంత నొక్కసిద్ధుఁ డతనిభాగ్యమున నా
చేరువను లతాకుటీరమునను. 6

క. ప్రవిమలతపంబుఁ జేసెడు
నవసరమునఁ గనియెఁ గన్నులర విచ్చి ముని
ప్రవరుఁ డవచాటముగ వి
ప్రవరునినుష్ణైత్యతరకృపాపాంగములన్. 7

ఆ. కాంచి సగరఁ జేరఁగా వచ్చి జలములఁ
దెచ్చి యిచ్చి దప్పి దీర్చి కొంత
సేపు మిగులశీతలోపచారంబులు
లిపి భూమిసురునియలపుఁ దీర్చి. 8

తే. నాఁడు భోజన మైనయనంతరమున
విపణి కేతెంచి బంగారు విక్రయించి
వలయుసామగ్రిఁ దెచ్చి యవ్వారి గాఁగ
విందులనుఁ గూడి పొరుండు విందుఁ గుడిచె. 15

క. ఈసరణి నెంతయును సం
తోసమ్మునఁ గాల మొలిఁ ద్రోయుచు నుండన్
భూసురున కాత్మలోఁ జే
రాస యుదయ మయ్యెఁ గతిపయదినంబులకున్. 16

ఆ. "చెట్టు చెడెడువేళఁ బుట్టుచుండును కుక్క-
మూతిపిందె" లనెడు నీతిరీతి
తపసియొద్ద నున్నతపనీయ మంతయు
నపహరింపఁ దలఁచె నవనిసురుఁడు. 17

తే. ప్రాణదానంబుఁ జేసిన యట్టిపలుకుఁ
బసిఁడి యొసఁగెడుపలుకుఁ దల్పఁ డెదలోన
మునిని వంచించి కనకముఁ గొనఁ దలంచి
పొరుఁ డౌర కృతఘ్నుఁ డై పైఁడికతన. 18

తే. కడఁగి గురువుకు బొమ్మ వెట్టెడుపడువున
వసుధఁ దన కేడుగడ యైన వానిఁ గొంపఁ
ద్రవ్వఁ దలపించె నక్కటా! ద్రవ్య మింక
నెట్టిదుష్కృత్యములనుఁ జేయింప దిలను. 19

ఆ. తలఁచి తనదుసతినిఁ బిలచి యేకతమునఁ
జెప్పె నిట్లు తనదుచిత్తవృత్తి
నొసఁగుచున్నవాఁడు యోగి బంగారము
ప్రతినంబు మనకు వలసినంత. 20

ఆ. అరయ నెంత కలదొ యాతనిగృహమున
నెంతలేక మనకు సంతతంబు
నీయఁ గలుగు బెట్టు లింతింతబంగార
మతని కెట్టు లబ్బె నబ్బురంబు. 21

క. ఈరే యతనికుటీరముఁ
జేరం జని యెల్లయెడలుఁ జెచ్చెర నే గ్రొ
వ్వారంగా శోధించియుఁ
గోరిక గలయంతపసిఁడిఁ గొని యేతెంతున్. 22

ఆ. వలసినంత వైభవంబు రేపటినుండి
యనుభవింపవచ్చు మనము నిజము
దినదినంబుఁ బోయి దీనుండ నై యోగి
నడుగ నేల నాతఁ డిడఁగ నేల. 23

క. ఈగతినిఁ జెప్పఁదొడఁగిన
నాగరితలమిన్న హరహరా యనుచుఁ జెవుల్
వేగిరముగ మూసికొనియు
బాగొప్పఁగ భర్త కనియె భయభక్తులతోన్. 24

క. అరయఁ దమకన్న ధర్మము
తెలుఁగం గలపాటిదాన నే దేవర యి
త్తఱిఁ గోప మిడక విని మది
నరయంగా సారెకును జోహారు లొనర్తున్. 25

క. సంతతము బీదతనమునఁ
జింతిల్లుచుఁ గాపురంబుఁ జేసెదుమన కా
వంత రవంతయు రానీ
కెంతయు దయ నమ్మహాత్ముఁ డిచ్చెడుఁబసిఁడిన్. 26

ఆ. అతనిఁ గనుమొరంగి యావంతబంగార
మేని మనము కొంటిమేని నాతఁ
డెఱిఁగెనేనిఁ గనక మిక నీదు సరి గదా
శాప మిచ్చునేని నోపగలమె. 27

క. ఆసకును మేర గలదే
యీసరణిని వాసరంబు లేగిన సరిపో
దే సంతతము మనకుఁ జే
రాసవలనఁ గీడు మూడు నన వినలేదే. 28

ఆ. ఇట్లు భార్య చాలహితబోధఁ జేసినఁ
జేటు చేరువగుటఁ జెవుల నిడక
పుడమివేల్పు నాటినడురేయి నడవికి
వెడలి తపసి యున్నయెడకు నరిగి. 29

క. చిటుకుమనకుండ మెల్లన
జటికులమణి చెంగటికి నిఁ జని మునివరుఁ డ
ప్పటికిఁ బటుయోగఘటిత
స్ఫుటచిత్తుఁ డగుటకు మదినిఁ బొంగుచు సరగన్. 30

తే. ఋషిగృహంబెల్ల సారెసారెకును వెదకి
వెదకి వేసారి మరి తుట్టతుదకు నెక్క-
చిన్నమంతైన బంగారు చిక్కకున్కి-
మదిని వగచుచు నుండె నాత్మాసురుండు. 31

ఆ. అంతలోనె మునియు ధ్యానంబుఁ జాలించి
కన్నుదోయి విచ్చి కాంచె నెదుర
భూమిసురుని నతఁడు ముని లేచు టెఱిఁగి భ
యార్తుఁ డయ్యె నట్టియవసరమున. 32

క. తిట్టక తిమ్మక మొట్టక
కొట్టక నెట్టకయు మదినిఁ గోపింపక తా
నట్టె యదృశ్యుం డై చనె
నెట్టిదొ యమ్మునిమహత్వ మెఱుఁగఁగ వశమే. 33

ఆ. అంత బ్రాహ్మణుఁడును నచ్చోటు నెడఁబాసి
గృహమున కరుదెంచి గృహిణి గాంచి
నడచినకథ కట్టకడదాక నెఱిఁగించి
తనదుబుద్ధిహీనత కేడ్చు వగచె. 34

క. బతిమాలుచు సతి చేసిన
హిత మాలనజేసి చెవుల నిడక కటకటా
మతిమాలినపనిఁ జేసితి
గతిమాలినవాఁద నైతి గవ్వకు నైనన్. 35

క. ఎంతటిపాపాత్ముఁడనో
సంతసమున నాకుటుంబసంరక్షణ మ
త్యంతముఁ గావించుమహా
శాంతుం డగుతపసి కెగ్గు సలిపితిఁ గట్టా. 36

తే. బాగుపడుదు ననుచు బంగార మడిగిన
ట్లిచ్చె గాక యమ్మునీశ్వరుండు
క్షితి నదృష్టవంతుఁ జెఱిచెడువారు న
భాగ్యు బాగుపరచువారు గలరె. 37

ఆ. నాపురాకృతంబు నన్నిట్టు లిడుముల
గుడువ జేయుచుండె విడువఁబోక
బ్రహ్మవ్రాసినట్టివ్రాతనుఁ దప్పింపఁ
దరమె నరుల కైన సురల కైన. 38

క. ధరలో నిరాశ సుఖ మిద్ధు
నిరవంద దురాశ దుఃఖ మిడును "నిరాశా
పరమం సుఖం దురాశా
పరమం దుఃఖ" మనుచుండ్రు పరమమునీంద్రుల్. 39

క. అనుచుం బశ్చాత్తాపం
బునుఁ జెందియు నాటనుండి భూమీసురుఁడున్
మునుపటివలె భిక్షాటన
మునఁ గాలముఁ గష్టముగనుఁ బుచ్చుచు నుండెన్. 40

ఫలితార్థము.

తే. అవనితలమున నత్యాశ యెవరి కైనఁ
జేటుఁ జేయును కావునఁ జెలువలార
దయను భగవంతు డిచ్చిన దానితోనె
చిత్తమందున సంతుష్టిఁ జెందవలయు. 41

---

## 9-వ కథ. హంస, కొంగలు.

ఆ. హంస యొకటి పుడమియం దున్నవింతల
నెల్లఁ జూచి పోవ నెడద నిచ్ఛ
వొడమి శీఘ్రగతినిఁ బుడమికి దిగి వచ్చి
సొరిది నెల్లయెడలుఁ జూచు చుండి. 1

క. ఒకనాఁడు వేనవేల్ మేల్
బకములు గలయొకసరోవరమున కరిగి కా
తుకమున నట విహరించుచు
నకలం కానంద మందునవసరమందున్. 2

.. అచట సంచరించునట్టికొక్కెరలయం
దొకటి హంసఁ జూచియున్నవాని

తోడ వింతకొంగ తోతెంచె నిట్టు వేగ
రం దటంచుఁ బిలువ రభసమునను.

తే. సరగఁ గొక్కెరలన్నియు నరుగుదెంచి
పండ్లగంపకు మూగెడుపడుచు లట్లు
హంసచుట్టునుఁ జేరి హాస్యంబు లాడఁ
జొచ్చె నొకకొన్నికొంగలు మచ్చరమున.

ఆ. అందు నొక్కకొంగ యను నిట్లు హంసనుఁ
జూచి యెవఁడ వీవు! చోద్య మయ్యెఁ
గాళ్లు మొగము నెరుపు కాపురం బెచ్చోటఁ
జెప్పు మచటఁ గలవిచిత్రములను.

తే. అనినఁ గొక్కెరతోడ ని ట్లనియె హంస
నేను హంసను వాసంబు మానసంబు
బ్రహ్మ కైనను నచటివైభవము నెన్న
నలవి గా దన్న మనబోంట్ల కలవి యగునె!

క. బంగారుజలరుహము లా
రం గారెడుమౌక్తికంబు లారత్నము లా
భృంగీసంగీతము లా
శృంగారము లెల్లఁ జూచియే తీరవలెన్.

తే. అచటిజలములత్రుంపును నచటిసౌర
భములపెంపును నచటిపుష్పములయింపు
నచటిమారుతములసొంపు నచటిరాజ
హంసములగుంపు మదులకు హాయి నింపు.

ఆ. అనుచుఁ బొగడుచున్నహంసనుఁ బొడగాంచి
పలికె నప్పు డొక్కబకము మరిచి

నావా! మానసమున లేవా! చేపలను జె
ల్లలను నత్తలనుఁ దలంప వైతి! 9

క. అనిన మరాళము కొంగనుఁ
గనుఁగొని యిట్లనియె మిగులగర్వముతోడన్
ఘనముగ బకముల కెదలోఁ
గినుక జనింపఁగనుఁ జాల గేలి సలుపుచున్. 10

తే. ఆలకింపుఁడు! కొక్కెరలార యచట
గొంగలును మరి నీరుకాకులును లేవు
బాతులునుఁ దీతువలుఁ గానఁబడవు లేనె
లేవు జలకుక్కుటములును లావుకములు. 11

ఆ. పీత లనెడుమాట వినఁ గూడ దచ్చోటఁ
జేప జెల్ల లనుచుఁ జెప్పరాదు
నత్త లనెడునుడి వినంగ రా దెన్నఁడు
నట్టివాని మేము ముట్టఁబోము. 12

తే. మానస సరస్సులోఁ స్నాన మాచరించి
బంగరుసరోజములతూండ్లు పరగ నమలి
యొలమిఁ ద్రోతుము దివసము లెల్లఁ బరమ
హంస లనియెడునామము సార్థకముగ. 13

క. పాలుఁ గొని నీళ్లు విడువం
జాలెడునేర్పెందుఁ బక్షిజాలములందున్
జాలఁగఁ గల దెవ్వరికి! మ
రాళములకు మాకు గా కిలాతలమందున్. 14

బ్రహ్మలోకంబు మొదలుగాఁ బదియునాల్గు
భువనములయందు సంచరింపుదుము మేము

వలువుమీ రెడుమందయానములచేత
గణుతిఁ గన్నార మెల్లలోకముల మేము. 15

ఆ. జీవహింసఁ జేసి జీవింత్రు నిరతంబు
దురిత మనక మీరు దుష్టవృత్తి
మాకు మీకు "హస్తిమశకాంతరము" కల
దరసిచూడ బకములార! వినుఁడు! 16

తే. హంస యీరీతిఁ దమగొప్ప నధికముగఁ
జెప్పఁగా విని కొంగలు చిత్తములను
సిగ్గుపాటు ననూయయుఁ జెంది కరము
నీరసంబున హంసకు నిట్టు లనిరి. 17

క. సారెకు మాపరు వెరుఁగక
నోరికి వచ్చినవిధాన నుడివెద విటు లా
రారా? మద మింత యేటికిఁ!
గ్రూరా! నినుఁ బట్టి కొట్టి గ్రొవ్వడఁతు మికన్. 18

క. నో రెత్తఁబోకు మంచునుఁ
గారు లఱవఁబోకు మనుచుఁ గదలకు మనుచున్
జేరి బకంబు లనేకప్ర
కారంబుల హంసఁ గవిసి కడుఘోరముగన్. 19

క. కాఱియలఁ బెట్టఁదొడఁగిన
వారించుచు నొక్కవృద్ధబక మిట్లను ని
ష్కారణము చూడవచ్చిన
వారిని బాధింతు రకట? పాపము కాదే! 20

క. పాపుల నైనను నెగ్గులఁ
గావించినవారి నైనఁ గరుణింపఁ దగున్

భావించి మాడఁగాఁ దమ
యావాసంబునకుఁ జూడ నరుదెంచు నెడన్. 21

క. కల్లో! నిజమో! మనకడ
నల్లనఁ దనగొప్పఁ జెప్పె నదియునుఁ దప్పే!
యెల్లిదమె! మనకు నేఁడో!
యెల్లియొ! తెల్లముగఁ దెలియదే యిదియెల్లన్. 22

క. పదుగురు మొకటై యీతని
సదమద మొనరించితిమేని సమయ మొదవినన్
మద మణచరె! యిది విన్ననుఁ
గదిసి మరాళములు మనబకంబుల నెల్లన్. 23

తే. వారి కవ్వారిగా విధిబలము కలదు
వాయసము లాతనికి హంసవార మగుట
వైర మొప్పదు మనలకు వారితోడఁ
బోరిలోఁ గెల్వఁబోలదు వారి మనకు. 24

క. ఎదిరిబలముఁ దనబలమును
మదిఁ దలపోయకయె కరము మాత్సర్యమునన్
గదనమునకుఁ గదిసిన నా
పద తప్పదు నిక్క మెంతబలవంతునకున్. 25

క. కావునను మీర లీతని
కేవిధ మగునెగ్గు సేయకే దయ విడువం
గావలయును నాదుమనో
భావం బిది దీని మీరు పాటింపఁ దగున్. 26

క. అని యివ్విధమున బోధిం
చిన విని యావృద్ధబకము చెప్పినటుల హం

క. బెడ గారు నొక యలారము
గడియారముఁ దెచ్చి మూడుగంటల కడఁ జొ
ప్పడర నలారమునిడి తన
పడుకకుఁ జెంత నొకబల్లపయి నిడుకొనియెన్. 4

తే. దాని కతమునఁ దప్పక మే నెఱింగి
తెల్లవాఱు నంచాక నా పిల్లవాని
కనుదినంబును విద్య నల్లనుఁ గఱపఁ
దొడఁగె నీరీతిఁ గొన్నాళ్లు గడచుటయును. 5

క. ఆమీఁద నాతఁడెంతయు
సోమరివాఁ డగుట చేత సుఖనిద్రకు నై
యేమియును వీలు లేమికిఁ
దామదిలో నిట్టులనుచుఁ దలపోసెఁ గడున్. 6

క. ఈ గడియారము చేతఁ గ
దా గుఱుఁడు నిరంతరంబుఁ దా మేల్కొనియెన్
బాగుగ నిద్దుర వోనీ
కీ గతినను వేచుచుండెఁ గృపలేక కడున్. 7

క. ఇది లేకున్నపు డొక్కొ
క్కదినమ్మున నైన నిద్ర కవకాశము నా
కొదవెడునది యిది వచ్చిన
యది మొదలుఁగఁ నదియుఁ బోయె నకట కటకటా? 8

ఆ. కాన, దీని నెట్లుగా నైనఁ గాఁజేసి
యనుభవింతుఁ గాక యనుదినంబుఁ
గరవు దీరఁగాను గాఢనిద్రాసౌఖ్య
మనుచు నిశ్చయించి యాదినంబె. 9

తే. ఎవ్వరును లేని తరినట కేగుదెంచి
సరగ నాగడియారము క్షణములోన
నద్దమునుఁ బ్రద్దలుగఁ జేసి యంత్రములను
నూడఁదీసియు మిక్కిలి పాడుఁ జేసి. 10

క. ఏమియు నెరుఁగని మాదిరి
గామసలుచు బాలుఁడుండెఁ గౌతూహల మెం
తే మదినిఁ బొదల నాటిని
శాముఖమున నొజ్జ లటకుఁజనుదెంచి వెసన్. 11

క. గడియారము పొడి పొడియై
పడియుండుటఁ జూచి కోప పరవశుఁడై యా
బుడుతనిఁ బొడఁ గాంచియునిటు
గడియారము చెడుటకేమి కారణ మని[illegible]న్. 12

ఆ. అయ్యవారితోడ ననియె నాబాలుండు
నేటిదినము నేను నిద్రలేచి
నిత్యకృత్యములను నెరవేర్చి బడికేగి
యిప్పు డిపుడె వచ్చి తింటి కడకు. 13

తే. ఇంతకన్నను నితర మే నేమి యెరుఁగ
నయ్య! మీయాన! యెపుడు బొంకాడు వాఁడఁ
గానటంచునుఁ జెప్పుచుఁ గంటనీరు
గార నేడ్చిన మదిఁ గనికరము నొంది. 14

తే. అతనినూరార్చి యా యుపాధ్యాయుఁ డపుడు
నాటి పాఠములన్ను బోధ నమ్మొనర్చి
శయ్యపైఁ జేరి శయనించి సగమురాత్రి
వేళలేచి శిష్యునిఁ జదివించెఁ గరము.

తే. అది మొదలు తాను ముదుసలి యగుటఁ దనకుఁ
గ్రమముగా నిద్ర పట్టని కారణమునఁ
గాల పరిమాణమును సరిగా నెఱుంగఁ
జేయు తన గడియారము చెడుట కతన. 16

తే. నిత్యము నిశీథమునఁ దాను నిద్రలేచి
బాలకుని మేలుకొలిపి తెల్లవారు దాక
విధి విరామము లేకొక విధముగానె
గురుఁడు శిష్యునకును విద్యఁ గఱపఁ దొడఁగె. 17

ఆ. బాలకుఁడునుఁ దనదు ప్రాలు మాలిక చేత
నిట్టి పుట్టి మునుక పుట్టె ననుచు
నాత్మ నెఱిఁగి తనదు నాగడంబునకునుఁ
బరితపించె మదిని మరియు మరియు. 18

## ఫలితార్థము.

తే. కడు దురాలోచనలుఁ జేసి యొడలు వంచి
పనులు చేయక తప్పించు కొనఁగఁ జూచు
నబ్జనేత్రకుఁ దొంటి సౌఖ్యంబుఁ బోయి
యధికమగుఁ గష్టమే వచ్చు నబలలార! 19

---

## ౧౧-వ కథ ఇలకోడి, బిడ్డ.

తే. మున్నొకానొక యిలకోడి ముద్దులొలుకు
తనదు పసిబిడ్డతో నొక్క మనుజునింటి
వాకిటనుఁ గల కలుగులోఁ బలుఁ జేరి
నిండు వేడుకఁ గాపురం బుండె నచట. 1

తే. సుఖముగాఁ గాలమునుఁ బుచ్చు చొక్కనాటి
రేయి నయ్యిలకోడి కూర్తిసుతఁ జెంతఁ

జేరఁగాఁబిల్చి యక్కునఁజేర్చి ప్రియము
గదుర నీరీతి నీతినిఁ గఱపఁదొడఁగె. 2

తే. అమ్మరో! నాదువాక్యమ్ము లాలకింపు
మేమఱియు నైన నవ్వలి కెన్నఁ డైన
నేగ కీ వొంటరిగ మనలోగ దాటి
యేగితేనియుఁ జెడుదు వాలాగు వినుము. 3

తే. బాల! యే మందు నిది కలికాల మగుటఁ
గోపచిత్తు లున్మత్తులుఁ బాపపరులు
మాయదారులుఁ జోరులు మలసి యురక
బాధ లొనరింపు చుందురు సాధులకును. 4

చే. మరియు, వినుము మున్ను మనవార లెందరో
యవల కరిగినార లందు నొక్క
రైనఁ గాని మరల వారు చెన్నఁటులచేఁ
జిక్కి చేవఁ దక్కి చెడుటె కాని. 5

తే. కావునను, నీ వెపుడు మనకలుగు దాటి
యావలకుఁ బోవలవ దంచు వేవిధముల
మరియు మరియునుఁ జెప్పి యమ్మాత మేత
బొట్టియకుఁ బెట్టి తద్దయు బుజ్జగించి. 6

తే. ప్రొద్దుపోవుటయునుఁ దనముద్దుబిడ్డ
నెనరు తనరంగ జోకొట్టి నిదురఁబుచ్చి
తానుఁ బవళించె మరికొంతతడవునకును
లేతయిలకోడి మేల్కాంచి లేచి వచ్చి. 7

తే. జనన చేసినహితబోధ సరకుఁ గొనక
లాగలోనుండి మెల్ల మెల్లన నొకింత

మీఁది కెగఁబ్రాకికొనివచ్చి మిన్నునందు
మెరయుచుక్కల వేనవే లరసి యరసి. 8

తే. ఉల్లమునఁ జాల నుప్పొంగి యొడలు మరచి
తన్ను మును భయపెట్టినతనదుతల్లి
నెంతయును నిందసేయుచుఁ గొంతవడికి
నెక్కుభూమియొద్దునుఁ జేరి యుత్సుకమున. 9

క. నలుగెలఁకులుఁ బరికించిన
లలి నాకాశముననుండి రాలినయలచు
క్కలవలె మిడుఁగురుఁబురువులు
తలతల మని మెరసె నెద ముదము తళుకొత్తన్. 10

తే. దీపకళికావళులు పటుదీప్తి గలిగి
పచ్చగా నారఁ బండినపండ్లవలెనుఁ
గానవచ్చి యెల్లెడలనుఁ గన్నుఁగవనుఁ
బండు వొనరించు చుండెను మెండుగాను. 11

క. వాకిట నాడెడుబాలల
కేకలు సుందరులు పాడుగీతములును వీ
ణాకిన్నరాదినాదము
లేకంబై మధురముగ లలిన్ వినవచ్చెన్. 12

తే. అప్పు డాపిల్లపిల్లిక హర్ష మాత్మఁ
బట్టలేక బొంతియ దాటి బట్టబయటి
కేగుదెంచి యెలుంగెత్తి గింగు రనుచుఁ
జెవులు చిల్లులువడ రొదసేయఁజొచ్చె. 13

తే. తోఁదనే దాపుననుఁ గలగోడనుండి
బల్లి యొక్కటి దానిపైఁ బడి బలిమిని

నోటఁ గఱచిపట్టి తినంగ నున్నయట్టి
తఱినిఁ జింతింపఁ దొడఁగె డెందమున నిట్లు. 14

తే. అయ్యయో! యెంతవెంగలి నైతిఁ దల్లి
మాట జవదాటి బల్లిచే మడియు చుంటి
నింక నిపు డేమి చేయుదు నెవరు దిక్క
టంచు వగచుచు దాని కాహార మయ్యె. 15

ఫలితార్థము.

తే. అతివ! పెద్దలమాటల కడుగు దాటు
బోటి తనతల్లిమాటను దాటినట్టి
లేతయిలకోడిరీతిని ఘాత నొందుఁ
గానఁ దల్లిదండ్రులయానఁ గడవ రాదు. 16



క. స్ఫీతమ్ముగ మృదులవచో
పేతమ్ముగ మంగిపూడి వెంకయచే శ్రీ
నీతికథామంజరి శ్రీ
హృత్తాపసరోజకుంజరి రచింపఁబడెన్.



# స్త్రీనీతికథామంజరి.

## శుద్ధపత్రిక.

| పుట. | పద్యము. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 10 | వీక్షించు | నీక్షించు |
| 6 | 11 | చిప్రము | చిత్రము |
| ,, | 12 | దలను | దలలు |
| ,, | 13 | యద్గాని | యద్దాని |
| 7 | 5 | నాడునక్క | యాడునక్క |
| 8 | 10 | పిల్లలగోతి | పిల్లలకోతి |
| 13 | 15 | గంగిరెద్గు | గంగిరెద్దు |
| 14 | 18 | నెమ్యేడకో | నెయ్యేడకో |
| 16 | 8 | అతిసులువుగగ్రహియింపుచు | అతిసులభముగగ్రహింపుచు. |
| 17 | 15 | కన్నునుఁగరంబు | గలహారులకన్న |
| 20 | 10 | ఘాతకుడై | ఘాతుకుఁడై |
| 26 | 21 | దైవచింతమ్మను | దైవచింతనమ్మను |
| 30 | 8 | సగర | సరగ |
| 32 | 20 | ప్రతినంబు | ప్రతిదినంబు |
| 35 | 35 | గతిమాలినవాద | గతిమాలినవాడ |